# ప్రేమారామం

(గేయ సంపుటి)

డా. జె. బాపు రెడ్డి

ప్రచురణ

చేతన

సాహితీ సాంస్కృతిక సంస్థ

15/3 అరండల్ పేట, గుంటూరు.

PREMAARAAMAM

Collectoin of Lyrics in Telugu

by Dr. J. BAPU REDDY

First Edition, 1986



Price Rs. 20

Cover design : Bali

Cover printing : Sri Ramanuja Printing Works, Vijayawada.

Published by :

CHETANA SAHITI SAMSKRITIKA SAMSTA
15/3 Arundelpet, Guntur.

With the Financial Assistance of A.P. Government.

*Printed at :*
Don Bosco Technical School Press. Ring Road, Guntur - 7.

సరస రసజ్ఞమూర్తి

విశ్వవిఖ్యాత జన్యుశాస్త్రవేత్త

# డా. P. మీరాఖాన్‌గారికి స్నేహోపాయనంగా

# అంకితం



డా. పి. మీరాఖాన్      డా. జె. బాపురెడ్డి

హాలండు నీ తలపుల
ఆమని ధామం
అందుకే ఈ కానుక
ప్రేమారామం—

మీరాఖాన్ మేరీజాన్
ఏ పేరో నీ పేరు
మేరలేని స్నేహానికి
పేరే నీ పేరు—

నగరంలో నాగరికుడు
అడవిలోని ఆటవికుడు
ని ఉపజ్ఞ యజ్ఞంలో
నిజరూపగుణపాత్రలు..

జీవసృష్టి రహోబాధ
జీవన పరిణామగాథ
బోధపడిన జన్యుశిల్పి
భూతలదివినిర్మాతా!

విజ్ఞాన "ప్రభా" కలితా
విజయ సమీరాహృతా
బాపురే! భారతి భావి
దీపము నీ భావగంగ...

మైత్రీ రసరాగ నేత్ర
చైత్రోదయగంధగాత్ర
అక్షర సన్మాన పాత్ర
అంబత్రయ ప్రియపుత్రా!

# ఆత్మావిష్కరణ

ఇది ప్రణయభావగేయసంపుటి. మొట్టమొదటే ఈ మాట ఇంత సూటిగా ఎందుకు చెపుతున్నానంటే, తర్వాత "కొందరు" పుస్తక సమీక్షకులు, విమర్శకులు తమ సహజధోరణిలో "ఇందులో కవిగారు ఎక్కువగా శృంగారజీవితానుభూతులే స్పృశించారుగాని సామాజిక సమస్యలను స్పర్శించలేదు" అంటూ వక్రభాష్యాలు చేయకుండా ఉండటానికి. గత మూడు దశాబ్దాలుగా నేను వ్రాస్తున్న కవితలను ముఖ్యంగా గేయాలను మూడుభాగాలుగా కూర్చి ప్రచురించాలని నాసంకల్పం. ఈ సంగతి అప్పుడప్పుడు నేను మనవి చేస్తూనే ఉన్నాను. 1985 ఉత్తరఅమెరికా తెలుగుమహాసభల్లో నేను పాల్గొన్న సందర్భంలో ఆవిష్కరింపబడిన నా "శ్రీకార శిఖరం" గేయసంపుటిలో కూడా ఈ విషయం పేర్కొన్నాను. అందులో—

"నేను ముప్పది ఏళ్ళుగా వ్రాస్తున్న కవితల్లో మూడు ముఖ్యమైన భావధారలు గమనించాను. ఆలోచనాశిఖరాలనుండి, అనుభూతుల లోయల్లోనుండి ప్రవహించే ఈ చైతన్యధారలు నిజానికి ఏకైక సత్యసౌందర్య ప్రకటనాత్మకాలే. మనకు అగుపించే ప్రకృతినీ, పరిసరాలనూ, మనం అనుభవించే జీవితాన్ని మూడురంగుల్లో చిత్రించుకుంటున్నట్లు, మూడు రంగాలుగా అన్వయించుకుంటున్నట్లు నేను గ్రహించాను. అందుకే మనభావాలన్నీ ప్రధానంగా ప్రణయోన్ముఖంగానో, ప్రగతిపరంగానో, ప్రణవాత్మకంగానో ప్రకటితమవుతున్నవి. అయితే ఈ త్రివిధాలోచనలూ త్రిముఖానుభూతులూ పరస్పర సామరస్య సమన్వయం కలిగి ఉన్నప్పుడే సమగ్ర జీవితానందం సాధ్యమవుతుంది. ఆ సరస సమన్వయ సాధనమే సాహిత్యం–ముఖ్యంగా కవిత్వం అని నావిశ్వాసం... ఈ దృష్టితో నేను నా కవితలను అందులోనూ గేయకవితలను మూడు భాగాలుగా విభజించి ప్రచురించాలని తలపెట్టాను" అంటూ నా ఆత్మనాదం వినిపించాను.

నా నిరంతర సాహిత్యయాత్రలో మార్గదర్శకులై, హితులై, స్నేహితులై నన్ను ప్రోత్సహిస్తున్న ఆత్మీయులందరకీ ఈ సందర్భంలో కృతజ్ఞతాంజలి ఘటిస్తున్నాను. అగణిత ఆప్తమిత్రులు ఎవరికి వారే నాకు ఆరాధనీయులు. అయితే ఆచార్య సి. నారాయణరెడ్డి, డా. దాశరథి, డా. బోయి భీమన్న, ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం, ఆచార్య తూమాటి దొణప్ప, డా. కనారిగ్ బొయాడ్జియాన్ (Dr. Knarig Boyadjiyan-U.S.A.) డా. ప్రసాదరాయకులపతి, డా. కరుణశ్రీ, డా. అమరేంద్ర; సాహిత్యకులపతులు శ్రీ దేవులపల్లి రామానుజరావు, డా. కృష్ణ శ్రీనివాస్ (Dr. Krishna Srinivas-Madras), శ్రీ పి. రమణయ్యరాజా వంటి తేజోమూర్తులు తత్సుహృత్కోటికి ప్రతినిధులుగా పేర్కొంటున్నాను.

నా "శ్రీకార శిఖరం" గేయసంపుటి, క్యాసెట్టు 1985 ఉత్తర అమెరికా తెలుగు మహాసభల్లో విడుదల చేయటానికి, ఆ తెలుగుసాంస్కృతికాభ్యుదయోత్స వాలలో పాల్గొనే భాగ్యం కలిగించిన అక్కడి మిత్రులకు ముఖ్యంగా డా. రాఘవేంద్ర S. ప్రసాద్, శ్రీమతి & శ్రీ N. R. మాచిరాజు, శ్రీమతి & Dr. రఘురాం వొల్లాల, శ్రీమతి & Prof. T. వెంకటేశ్వర్లు, శ్రీమతి & శ్రీ M. దేవేంద్ర రెడ్డి, శ్రీ K. పురుషోత్తమనాయుడు, Dr. K. సురేంద్రనాథరెడ్డి గారలకు నా వినయపూర్వక కృతజ్ఞతలు. ఆ సందర్భంలో నాకెంతో అభిమానంతో తోడ్పడిన సుప్రసిద్ధ సంగీత కళాతపస్వి శ్రీ సాలూరు రాజేశ్వరరావు, గానకళాకోవిదులు శ్రీ S. P. బాలసుబ్రహ్మణ్యం, సృజనాత్మకకళాశీలి బహుముఖప్రజ్ఞాశాలి శ్రీ దాసరి నారాయణరావు, సాహిత్యసేవాతత్పరుడు రసమయుడు శ్రీ M. K. రాము గారలను స్మరించకుండా ఉండలేను. నా నిర్విరామ కవితాయాత్రలో చెరిగిపోనిచిరునవ్వులు దారిబత్తెముగా అందిస్తున్న నా హృదయేశ్వరి రాజేశ్వరికి కూడా నా అభినందనాలు.

ఈ గ్రంథముద్రణలో నాకూ, చేతన సాహితీసాంస్కృతికసంస్థవారికీ సర్వవిధాల సహకరించిన సాహిత్యాభిమానులందరికీ ముఖ్యంగా సర్వశ్రీ A. బ్రహ్మానందరెడ్డి, V. సంపత్కుమారాచార్యులు, K. కోటేశ్వరరావు,

P. లక్ష్మీనారాయణరెడ్డి ప్రభృతులకు నా హార్దిక ధన్యవాదాలు. పుస్తకాన్ని ముద్దుగా ముద్రించిన "డాన్‌బోస్కో టెక్నికల్ స్కూల్ ప్రింటింగ్ ప్రెస్" వారికీ, ముచ్చటైన ముఖచిత్రం తీర్చిన శ్రీ బాలి గారికీ నా ప్రశంసాపూర్వక కృతజ్ఞతలు.

ఈ పుస్తక ప్రచురణకు సముచితమైన ఆర్థిక సహాయం అందించి నన్ను ప్రోత్సహించిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారికి, గౌరవనీయ ముఖ్యమంత్రి శ్రీ నందమూరి తారక రామారావుగారికి నా ప్రత్యేక కృతజ్ఞతలు.

మరి ఈ పుస్తకం అంకితాన్ని గురించి ఒక మాట. ఈ మధ్య నేను నా పుస్తకాలన్నీ విదేశాలలో భారతీయసంస్కృతికి వెలుగుబావుటాలుగా దీపించే తెలుగువారందరికి మహాసభలముఖంగా అంకితంచేసే అదృష్టం కలిగింది; అయితే ఈ పుస్తకం ఆప్తమిత్రులూ సాహిత్యచైతన్యదీప్తులూ అయిన డా. P. మీరాఖాన్ గారికి అంకితం చేస్తున్నాను. తెలుగుదనానికి, భారతీయ సంస్కృతికి, విశ్వమానవచైతన్యానికి ప్రతీకగా పతాకగా భాసించే విజ్ఞాన ప్రజ్ఞాన తేజోమూర్తి ఆయన. కాకినాడ కడలి తీరంనుండి నెదరులాండు కుకెన్‌హాఫ్ పూల కడలి తీరం చేరిన విశ్వప్రేమారామవిహారి ఆయన—జగద్విఖ్యాత జన్యుశాస్త్రవేత్త. ఆయన ప్రియసతి ప్రభావతి రాశీభూతతెలుగుసంస్కృతి. వీరిద్దరూ, వారి పిల్లలు అజిత్—అజాదు లిద్దరూ ప్రాక్పశ్చిమాలు మేళవించిన కులమతాతీత విశ్వమానవులు—స్వచ్ఛంద మానవతామూర్తులు. మా చిరకాలమైత్రికి స్నేహోపాయనంగా డా. మీరాఖాన్ గారు ఈ కృతిని స్వీకరిస్తున్నందుకు వారికి కృతజ్ఞతాభివందనాలు తెలియజేస్తున్నాను. 1967–68లో ఆత్మీయులు డా॥ వై. వేణుగోపాలరెడ్డి శ్రీ J.M. గ్రిగ్లాని, శ్రీ డి. ఆర్. రాజు, నేను నెదరులాండులో మీరాఖాన్‌తో కలిసి వెలిగించుకున్న స్నేహపరిమళవసంతాలను ఈ తరుణంలో తలచుకొని పులకిస్తున్నాను.

రసజ్ఞులు, జిజ్ఞాసువులు, వసుధైకకుటుంబసభ్యులైన పాఠకులందరినీ ఈ అమ్లాన "ప్రేమారామం" లోకి ఆహ్వానిస్తున్నాను.

జె. బాపురెడ్డి

# ఇందులో

# వెన్నెల వెండి తెరపై

వెన్నెల వెండి తెరపై
పసిడి వన్నెల తారక నాట్యం
ఛాయాచిత్రం కాదోయి
తచ్ఛాయా చిత్రం నేనోయీ!

చుక్కలు చూచి
దిక్కులు చూచి
ఉక్కిరి బిక్కిరి కాకోయీ
నా ప్రక్కన నిలిచి చూడోయీ!

నా జాతకమే నీ జీవితము
నా జీవితమే నీ జాతకము
సాముద్రికము చూడకుమోయి
నా మోమున మోమిడు మోయి!

అన్ని భాషలు అన్ని భావములు
అన్ని రాగములు అన్ని రసాలూ
నేర్పెడి నేర్పరి నేనోయీ
నీ అనుభూతిని నేనోయీ!

పంచేంద్రియములు
పంచప్రాణములు
పరవశించె ఈ వాసరము
ప్రణయసఖా! నీ కోసరము!

# నిన్ను చూచిన నాటినుండి

నిన్ను చూచిన నాటినుండి
నన్ను నేనే మరచిపోతి
నిన్ను పొందిన నాటినుండి
నన్ను నేనే కోలుపోయితి___

ఎన్ని ఎన్నో కలలు కంటి
అన్ని నీలో కంటిని
ప్రేమ వేరే లేదు, నీవే
ప్రేమ వని కనుగొంటిని ___

చీకటులలో నీ కనులలో
లోక బాంధవు చూచితి
వేకువలలో నాకనులలో
విభవ చంద్రుని దాచితి___

నీవు నేను కలసినపుడే
నిలిచి పోయెను కాలము
ప్రణయవాసంత మ్మిదేయని
పాడుకొను పికజాలము___

# బంగారు పత్రాల మీద

బంగారు పత్రాలమీద
భావాలెవో వ్రాసి వ్రాసి
పంపించు చిరుగాలితో
చెలునికై
పరువాల చెట్టుకొమ్మ
మురిపాల ముద్దుగుమ్మ-

పత్రమేమో
శిశిరగాత్రమైపోవునని
చిరుగాలి
పెనుగాలిలో కలిసి పోవునని
తెలియదో తరుబాలకు, అర్థమే
తెలియదో భావాలకు!

ఎన్నెన్ని పత్రాలు
ఈ నేల రాలెనో
ఎన్నెన్ని భావాలు
ఈ గాలి కలిసెనో
అందుకే ఈ నేల బృందావనం
అందుకే ఈ గాలి అతి సురభిళం!

కొమ్మ కొమ్మకు ఎన్ని
కోరికల పత్రాలో
తెమ్మెర ఎదకు ఎన్ని
తీపి గాథల బరువో
బ్రతుకు పత్రాలలో
భావాలకై వెదుకు
వెర్రి ప్రియు డెన్నెన్ని
వెత లనుభవించునో!

# నవవసంతానివై

నవవసంతానివై అవతరించెద వంచు
నా బ్రతుకు తోట ఇన్నాళ్ళు పెంచితినే!
స్నేహానిలయములతో- చిరునవ్వు విరులతో
విరహ శిశిరమునుండి విడిపించు నను చెలీ!

ప్రేమ రసవృష్టి కురిపింతువని ఆశించి
జవ్వనీ! నా విమల యౌవన క్షేత్రాన
చల్లితిని మంజులాశయ బీజములు ఎన్నొ
ఈ ప్రవాసపు అనావృష్టి కడతేర్చవే—

విడిపోని నీవలపు బిగి కౌగిళుల చేర్చి
రసరాగ మధుర స్వర్గము ప్రసాదింతువని
దేవతలకాచు- నా దేవి నిను కొలిచితిని
ఎడబాటు నరకాన పడియుంటి విడిపించు—

నీ అందియల మాట- నీకింకిణుల పాట
వినవెంచి మరియేది వినకుండ, నీ మీదె
నిల్పితిని ధ్యానము- నీరవస్థితినుంటి
శ్రుతినించు సఖియ నా శూన్య జీవితములో—

కల్పించి వ్రాసినదికాదు ఈ కావ్యము
కాలిపోయెడిగుండె జాలిమొరలే ప్రియా!
దళిత జీవిత విపత్కాల గానము ప్రియా!
శరణాగతుడ నేను కరుణించి రక్షించు—

# ఓ నిమీల నేత్రీ

ఓ నిమీల నేత్రీ
ఓ ప్రమీల గాత్రీ
వచ్చావా నావలపు తోటకు!

కళ్ళు తెరిచి చూడుము
నా ప్రేమారామం
ఒళ్ళు విరిచి చూడుము
నా కలల గుడారం___

చాలించుము ధ్యానము
బోధించుము జ్ఞానము
చాలు చాలు అవధానము
తీర్చుము నాకామన___

నీ దేవుడు ఎవరైనా
నా దేవివి నీవేలే
నీ లోకము ఏదైనా
నాలోకము నీవేలే___

గళము గళము కీలించి
గానము చేయుదమా
మనసు మనసు జోడించి
మౌనము పూనుదమా___

# నీ చూపులలో ఇల్లు

నీ చూపులలో ఇల్లు
కట్టుకొంటిని
నీ నవ్వులలో దీపం
పెట్టుకొంటిని—

నీవే నా వెలుగైతివి
నీవే నా నీడవు
అయినా నన్నెరుగ నట్లె
అగుపించే జాడవు—

నీలో నేనున్నట్లు
నిన్ను కలలు కంటిని
నాలో నీవున్నావని
నేడు తెలుసుకొంటిని—

కాంతి కొఱకు వెదకి వెదకి
కన్ను మూసితి
నన్ను కనులు చేసుకున్న
నిన్ను చూచితి -

# ఎందుకు ప్రేమింతు

ఎందుకు ప్రేమింతు నిన్ను
మందమతిని నేను
మండే దీపాగ్ని దూకి
మడిసే శలభమును___

నన్ను అలుముకున్న ఇరుల
నెన్నో వదలించుకుంటి
మండిపడే నీ ఒంటిని
మనసారా అలుముకుంటి

అందము దీపజ్వాల
డెందము శలభమ్మెమొ
నీలో లీనము కానిది
నాలోనే లేదేమో!

నీ భావ జ్యోతి లోన
నే అక్షరమ్మై పోనా
నీ స్మిత బృందావనిలో
నే శ్రుతినై పోనా!

# శాస్త్రాలన్నీ చదివి

శాస్త్రాలన్నీ చదివి
సోహమనుట నేర్చితి
నిన్ను చూడగానే
దాసోహముగా మార్చితి___

నిమిషము నీ ముందునిలిచి
అనిమిషుడను అయిపోదు
నిన్నుచూచి మిన్నుచూచి
నన్ను నేనె మరచి పోదు
నీ కన్నుల దోషమా!
నా భావావేశమా!

నీ కచ కుచ భారాలను
నా చూపులు మోయలేక
వ్రాలిపడును నీ నితంబ
లీలా తల్పముపైన
నీ అందమె ఉన్నతమో!
నా డెందమె సున్నితమో!

నీ నడకల డోలికల్లో
నా నడవడి మారిపోవు
నీ వంపుల సొంపుల్లో
నా ఆశలు మీరిపోవు
నీ రూపమె మోహనమా!
నా మోహమె నిరుపమమా!

కన్నెత్తే చూడకున్న
నిన్నారాధింతు నేను
పలుకరించకున్నా, నిను
పలుకరించి పులకరింతు
నీ ప్రణవమె ప్రణయమా
నా ప్రణయమె ప్రణవమా!

# ధరణీధరము నీవు

ధరణీధరము నీవురా
ధారాధరము నేనురా !

నాకు పీఠము నీవు
నీ కిరీటము నేను
నాకు పల్లవి నీవు
నీకు పాటను నేను —

నామౌనభాష వీవు
నీమనోభావ మేను
నాతపోరూప మీవు
నీ యశోదీప మేను —

నాసత్య శిల్ప మీవు
నీ స్వప్న చిత్ర మేను
నాసుకృతి పాణి వీవు
నీ విజయవీణ నేను —

నా జీవితము నీవు
నీ జీవనము నేను
నా లోకపతి వీవు
నీ నాకపథ మేను —

# సుషమ కుసుమవనిలో

సుషమ కుసుమ వనిలో
రసధుని నై పోనా
తరుణ భావ సాగరాన
తరంగమై పోనా —

పూచిన ప్రతి పూవులో
తోచును ఆనంద రోచి
పరవశించు గాలిలో
పరిమళించు ఆత్మీయత —

చిరునగవే చేలముగా
స్థిర చిత్తమె శీలముగా
పరసుఖమే భాగ్యముగా
బ్రతుకే పూలకు నమస్సు —

ఓరిమి, కూరిమి పెంచే
ఉద్యానమె నా కోట
విహగాలకు పాట నేర్పు
విరులతోట నా బాట—

రావేచెలి! నా జీవన
ప్రణయా రామమమై
పాడవే! నాభావ
పారిజాత విటపివై—



ప్రేమా

# అద్వైత వాది

అద్వైతవాదినే నేను
నినువీడి
మనలేను క్షణమైన నేను —

నీలోన నేపూర్తి
గా లీనమౌటకే
ఆలింగనా యోగ
మాచరింతామే ....

నీ మోవి నా మోవి
నింగినేలల వోలె
ఆనంద దిక్చక్ర
మై పోవలెను సఖీ ....

మధ్యందినములోన
మాయమౌ నీడవలె
నీ కనులు నా కనుల
లో కలసిపోవాలి ....

నిత్యమై సత్యమై
నినదించు మనఎదలు
ఏకాంత సీమలో
ఏకమై పోవాలి ....

# నీ కన్నుల వెలుతురులో

నీ కన్నుల వెలుతురులో
నే కన్నులు తెరచాను
కనులు తెరచి నేనిది, భూ
లోకమనే మరచాను—

నీ పెదవులు తరచాను
నను నేనే మరచాను
మరచి ఇంద్రలోక సుధా
మాధురిలో నిలిచాను—

నీ చెక్కిలి నొక్కాను
నే మహిగిరు లెక్కాను
గాలి ఈలవేయ, శివుని
లీల నాట్యమాడాను—

నీ నడుమును చుట్టాను
నింగి కొసలు ముట్టాను
ప్రణయ కళా సీమ లేలి
పంచాస్త్రుని కొట్టాను—

నీ కౌగిలి చేరాను
నే కన్నులు మోడ్చాను
కనులు మోడ్చి నిజమైన
కలలెన్నో చూచాను—

# అబ్బా ఎన్నాళ్లకు

అబ్బా, ఎన్నాళ్ళకు నీ
అమృత గళము విననాయె
కోటిరాగ వీణ లొకే
మాటు మీటి నటులాయె!

హృదయమున్న నేమి, దాని
కదలించు సమీరమేది?
కన్నులున్న నేమి, వాని
కరగించెడి దృశ్య మేది?

నీవు నిజంగానే నను
నిదుర నుండి లేపావు
కాదు, నిదురలేని దివ్య
కాంతి పథము చూపావు.

నీ చెలిమి వసంతంలో
లేవు శిశిరఘాతాలు
నీ శీలానందంలో
లేవు జరా మరణాలు.

నీవు అనిర్వచనీయవు
కాని చిరస్మరణీయవు
నేను ఇంత వరకు జడుడ
కాని ఇపుడు కవీశ్వరుడ.

# ఏమంచు పేరిడుదునో

ఏమంచు పేరిడిదునో నీకు చెలియా!
ఏ మంజు గీతాల నిను కూర్తునే ప్రియా!

నీముందు తన మందహాసాల రుచి మాయ
ఆ సరోజిని ముఖము ముకుళించుకొనెనే
నీ నుదుటి ప్రణయ కుంకుమ కాంతులను జూచి
సిగ్గిల్లి తారమ్మ కారు మబ్బుల దూరె___

నీ కుంతల వినీల కాంతి తరగల జూచి
ఆ సునంద మిళిందబాల ముసుగు బిగించె
ఆ వీణ నీ గానమున మ్రోగలేక
సాగి తీగలు తెగగ మూగవడిపోయె___

పతిలేని మతిలేని రతిరాణి నిను జూచి
"బ్రతుకేల నాకు" అని చితి కూర్చుకొన జూచె
లక్ష్మి సరస్వతీ శైలజా సత్కళలు
కలిపి చేసెనో నిన్ను నలువ నా కోసమే___

ప్రేవ

# తన ఒళ్ళంతా ఊపినది

తన ఒళ్ళంతా ఊపినది
నా మదిలో మంటలు రేపినది
తానే మంటై లేచినది
నా తనువే తానై పోయినది—

ఆడే దీపం పాడినది
నా వెలుగే పాటై పోయినది
పాడే పాట ఆడినది
నా నీడే ఆటై పోయినది—

చీకటిలో దీపం పట్టి
తన చీకటి తానే చూపినది
సిగ్గుకు చీకటి భగ్గుమని
నా చిత్తములో శివమెత్తినది—

గుడ్డలు దాచిన అందాలు
లోగుట్టు బయట పెట్టేసినవి
గదిలో వీడిన బంధాలు
కాలానికి కళ్ళెం వేసినవి.

# ఏమంచు పేరిడుదునో

ఏమంచు పేరిడిదునో నీకు చెలియా!
ఏ మంజు గీతాల నిను కూర్తునే ప్రియా!

నీముందు తన మందహాసాల రుచి మాయ
ఆ సరోజిని ముఖము ముకుళించుకొనెనే
నీ నుదుటి ప్రణయ కుంకుమ కాంతులను జూచి
సిగ్గిల్లి తారమ్మ కారు మబ్బుల దూరె—

నీ కుంతల వినీల కాంతి తరగల జూచి
ఆ సునంద మిళిందబాల ముసుగు బిగించె
ఆ వీణ నీ గానమున మ్రోగలేక
సాగి తీగలు తెగగ మూగవడిపోయె—

పతిలేని మతిలేని రతిరాణి నిను జూచి
"బ్రతుకేల నాకు" అని చితి కూర్చుకొన జూచె
లక్ష్మి సరస్వతీ శైలజా సత్కళలు
కలిపి చేసెనో నిన్ను నలువ నా కోసమే—

# తన ఒళ్ళంతా ఊపినది

తన ఒళ్ళంతా ఊపినది
నా మదిలో మంటలు రేపినది
తానే మంటై లేచినది
నా తనువే తానై పోయినది—

ఆడే దీపం పాడినది
నా వెలుగే పాటై పోయినది
పాడే పాట ఆడినది
నా నీడే ఆటై పోయినది—

చీకటిలో దీపం పట్టి
తన చీకటి తానే చూపినది
సిగ్గుకు చీకటి భగ్గుమని
నా చిత్తములో శివమెత్తినది—

గుడ్డలు దాచిన అందాలు
లోగుట్టు బయట పెట్టేసినవి
గదిలో వీడిన బంధాలు
కాలానికి కళ్ళెం వేసినవి.

# దూరమై పోయింది

దూరమైపోయింది
నా రమ
నన్ను
నటరాజు చేసిన
నా ఉమ!

తనకు తానై వచ్చి
మనసంత దోచుకొని
ధీశాలినా నన్ను
దాసోహ మనిపించి
దూరమైపోయింది నారమ....

అన్ని సంపదలకు
శ్రీ కారమై తోచి
నా కోర్కె లన్నిటికి
ఆకారమై పూచి
దూరమైపోయింది నారమ....

వలపు గీతులు పాడి
అలసినది నా వాణి
నడిరేయి గుడిలోన
నర్తించి నర్తించి
సొమ్మసిలి పోయినది
నా భావ గీర్వాణి!

# ఆస్తులెన్ని ఉన్నా

ఆస్తులెన్ని ఉన్నా
ఆభరణాలెన్ని ఉన్నా
నీ ప్రేమే లేకుంటే
నిరుపేదరాలినిరా!

చుట్టాలూ స్నేహితులూ
స్తోతలు ఎందరు ఉన్నా
నీ పొందే లేకుంటే
లోకము యమలోకమురా!

విద్యలెన్ని నేర్చినా
శక్తులెన్ని ఆర్జించిన
నీ చేతులలో కరగి
నీరవమై పోవనిదే
నాకు లేదు చేతనము

నా ఇల్లే ప్రేపల్లె
నా వేదన నడిరేయి
నా కన్నీరే యమునా
నదిరా! రారా ప్రియా!

# సారంగపాణి

సారంగపాణి
అలినీలవేణి
ఆడేరు యమునా తటాన
అందాల బృందావనాన___

ఒకచేతిలో మురళి
ఒకచేతిలో ముగ్ధ
రవళించు రమణీయబాధ
రసలోక రసవత్ ప్రబోధ....

ఒకవంక క్రీడించు
ఒకవంక పీడించు
గోపాలకుని రాసలీల
గోపీ హృదయ రాగకీల....

నావాడు అని యమున
నావాడె యని బృంద
నావాడు అని గాలి
నా వాడె యని నేల
నా వాడె, నా వాడె అని
చరాచర మెల్ల
ఆనందమున పొంగిపోవు
గోవిందు డానందరూపమై పోవు.....



ప్రేమా

# నీ కన్నులగినెన్నెలలో

నీ కన్నులగినెన్నెలలో
నే నమృతం త్రాగి త్రాగి
అనిమిషుడను అయిపోతిని
అనఘుడనై పోయితిని___

ఆ చీకటి కొండలలో
అవతరించి మోహినివై
నా బాధల భస్మాసురు
నాశన మొనరించావు___

విజయము నీ పదము లంటి
వెంట రాగ నీడ వోలె
చిదమల ఆనంద గిరి
శిఖరము నను చేర్చావు!

నీ దరహాస ప్రభల
నా బ్రతుకే రాగ మురళి
నీ సుందరతా బృందను
నా డెందము గోవిందము!

# గుండెలోని కోరికా

(యుగళ గీతం)

గుండెలోని కోరికా
కొమ్మ మీది శారికా
చదువు కుందాము రావే ఈ తోటలో
పాడుకుందాము
క్రొత్త బ్రతుకు బాటలో—

రాలే పత్రాల మీద
రాసినాను చదువుకో
చెట్టుకున్న త్యాగము
చెలికానికి లేదని—

కాలేజీ చదువు పూర్తి
గావచ్చెను ఏం లాభం ?
కన్నెపిల్ల వలపుగుండె
కావ్యమైన చదవలేను—

పువ్వులు చెప్పే పాఠం
పుస్తకాలలో లేదు
కోకిలమ్మ రసరాగం
ఏ పంతులు నేర్పలేడు—

గరికనేల మన కోసం
పరచినదే పానుపు
వెలకిలపడి చదువుదామె
తారాక్షర గ్రంథము—

# అగ్నికీలవోలె నీవు

అగ్నికీలవోలె నీవు
నగ్ననాట్య మాడవే!
గుండెలో దాగిన, నా
గుట్టు బయట పెట్టవే!

త్రాగినట్టి తాపసులకు
యోగినిలా భాసింతువు
అహంభావులకు, వట్టి
ఆటకత్తె వనిపింతువు!

విడిచివేసి గుడ్డలన్ని
వేమన యోగీశుడయ్యె
వలువలు లేనట్టివారె
విలువలు బోధింతురేమొ?

అజంతా గుహాలలోన
అప్సరలకు లేని సిగ్గు
ఏల కేబరే నర్తన బాలా
ఈ రేల నీకు!

# మగువా! నిను చూశాను

మగువా! నిను చూశాను
మధువు మానేశాను
పతనమయే నా వయసును
పట్టి ఆపి వేశాను___

ఆకాశంలో ఎచటో
నాకమున్న దనుకొంటి
చీకట్లను వెలిగించే
నీ కన్నులలో గంటి___

చదువులు శాస్త్రాలెన్నో
చదువుకొంటి ననుకొంటి
నీ కౌగిలిలో తిరిగి
శ్రీకారం చుట్టు చుంటి___

గిరులు ఝురులు చూచి, నిన్ను
మరచి పోదు ననుకొంటి
వాటిలోను నిన్నె చూచి
వలపు పాట నగుచుంటి___

# అందమంతా మోసుకొని

అందమంతా మోసుకొని
పోతున్నది
నా గుండెనంతా దోచుకొని
పోతున్నది ....

చూడనట్లే చూచి నన్ను
చూడనీదురా మరేదీ
కదలనట్లే కదలి
కదలనీదురా నన్ను

దాచినట్లే దాచి
చూపుతుందిరా సర్వం
తెలియనట్లే తెలిసి
తెలుపును తన ఆంతర్యం

ఒక్క నడుము కదలికలో
లెక్కలేని సోయగాలు
మగువ వెన్నుపూస కెన్ని
మంత్ర విద్యలు అబ్బెనో!

భువనాలు మోసేటి
భుజగరూపి ఆమె
గగనాల తేలేటి
కాలరూపి ఆమె.

# మసకచీకటి చీర

మసకచీకటి చీర కట్టిన
మసృణ ఊహాల సంధ్యతో
ఆడుకొంటిని పాడుకొంటిని
అమల సైకత సీమలో ....

ఎవరు నీవని ఎవరు నీవని
ఎవరి నెవరము అడిగినామో
సరససాగర వీచికలలో
శబ్దమే వినిపించ దాయెను.

చేయి చేయికి ఈయమంటే
చిరునగవు లందించె నామె
తనువు తనువున చేర్చ మంటే
తత్వములు బోధించె నామె.

మనసు నీదని తనువు కాదని
మాయమైనది మధురరూపం
ఎడదలో వెలిగించి పోయెను
ఎపుడు ఆరని రాగ దీపం.

# కటికనేల నడచి నడచి

కటికనేల నడచి నడచి
కందిన నా పాదాలు
ఎర్రగులాబీలై పోయెనురా—

ఈ యౌవన భారము
మోయలేక నా నడుము
తరిగి తరిగి కరగి పోయెకదరా—

చీకట్లను చించి చీల్చి
నీ కోసం వెదకి వెదకి
నా కన్నులు కాటుకలై పోయెనురా—

నిన్నే మదినిల్పి, చేయు
చున్న ప్రేమ తపసున-నా
జడలు మడమలంట పెరిగిపోయెనురా—

తాపముతో, నీవు రాని
కోపముతో కొరుకుకొన్న
నా పెదవులు కుంకుమపూలాయెనురా—

నా వలపులు నా తలపులు
నీ కొరకై వేచి వేచి
గుండె మీద గుడులు కట్టుకొన్నవిరా—

ఊహలతో ఊగి తూగి
ఉండలేక దొరలిన నా
తనువెల్లా వంపులు పడిపోయెనురా—

# కొకోక్కకం

కొకోక్కకం చదువుదాం
కోనార్కులో
ఒక్కొక్కం అయిపోదాం
కలల పార్కులో—

సూరీడు కట్టుకున్న
శృంగారాలయములో
రాసకేళి జరుపుదాము
రావే ప్రమదామణీ!

కడలి ప్రమిదలో
సంధ్యాదీపం పెట్టి
ప్రణయ శైలజా శివులకు
ప్రణమిడుదామే!

సృజన శిల్ప కల్పనలు
జిజీవిషా జిగీషలు
సాగిపోవు శిలారథ
సారథ్యం నెరపుదాం—

రతీమన్మథులు ఎరుగని
రమణీయరహస్యాలు
రాతిబొమ్మ లెరిగించును
రావే, కోనార్కులో—

# ఆకాశవాణిపై

ఆకాశవాణిపై
ఆంగ్ల గీతాలు
తలపించు నిన్ను, ఓ
తరుణీమణీ !

చుక్కవలె ఆనాడు
ఎక్కడో కనిపించి
పట్టుమని నాగుండె
పట్టుకొని పోయితివి—

పడమటి కడలిగట్టు
పై సంజవేళ-నీ
చిరునవ్వు వలలోన
చిక్కిపోయితి సఖీ !

యువవాణి నీది, నవ
నవ భావములు నావి
కలసి పాటలు పాడి
ఖగములై పోయినవి—

ఏ విలాసము లేని
ఈ వియత్తలములో
వెదకి వెదకి నిన్ను
వెన్నెలై పోదునో!

# మధుమాసం ఎదురొస్తే

మధుమాసం ఎదురొస్తే
ఏ కోకిల పాడకుండు
ఆకాశం చెమరిస్తే
ఏ మయూరి ఆడకుండు!

మరుమల్లియ కవ్విస్తే
ఏ మధుపము ఊరకుండు
అరుణబాల హసియిస్తే
ఏ కుక్కుటి కూయకుండు

చిరుగాలి చిటికేస్తే
ఏ పరువము దాగియుండు
సెలయేరే శ్రుతిచేస్తే
ఏ శిల ఎద కదలకుండు

కొమ్మ, పండుచూపిస్తే
ఏ పక్షి మెదలకుండు
శశి, వెన్నెల కురిపిస్తే
ఏ చకోరి ఎగరకుండు

కోరి కోరి నీవే, నా
గుండెలోన చొరబడితే
ఈ లోకమె నాకమని
ఎలా పాడకుండ గలను.

# నీవొక గాండీవం

నీ వొక గాండీవం
నేనో ఒక పాశుపతం
సంధించుము పేదవారి
శక్తికి విజయమ్ముగా—

నీవొక విప్లవ మేఘం
నేనో ఒక నిర్ఘాతం
కురిపించుము దురాచార
ఘోరతమము కూలగా—

నీ వొక మధుమాసం
నేనో ఒక మార్పు పికం
శ్రుతి చేయుము నవజీవన
రుతి లాస్యము చేయగా—

నీ వొక భావార్ణవం
నేనో ఆశానౌకను
నడిపించుము ప్రణయ తీర
నందన నగరాలకు—

# ఏమున్నది ఈ భువిలో

ఏ మున్నది ఈ భువిలో
నీవే లేకుంటే
ఏమున్నది నా బ్రతుకున
నీవే రాకుంటే__

మట్టికి ప్రాణం పోసే
మహీరుహము నీవు
శిలలకు గానం నేర్పే
జలధారవు నీవు__

చుక్కల కర్థం చెప్పును
చిక్కని నీ చూపులు
పూలకు తావులు అద్దును
ఊగే నీ ఊపిరులు__

సృష్టి రహస్యం చెప్పే
శృంగారము నీవు
మాయామర్మం విప్పే
మమకారము నీవు

భాషలెన్ని ఉన్నా
నీ ఆశే నా భాష
ఊహలెన్ని ఉన్నా
నీ ఊహే నా ఊహ__

ప్రేమా

# పేరు చెప్పలేదు

పేరు చెప్పలేదుగాని
ప్రేమ పంచినావు
ఊరు చెప్పలేదుగాని
ఊరడించినావు—

ఏకాకిని నన్నుజూచి
ఏమనుకొన్నావో
తెలియని నీభాషలో
తీయగ పిలిచావు.

కదలినావు-తద్యానము
వదలించెను నిద్రాణము
నిలిచినావు-తన్మౌనము
వెలిగించెను ప్రజ్ఞానము.

నీ తరుణారుణ వదనం
నియతభావ సదనం
కలిగించిన అనుభూతి
కాలాంబుధి మథనం—

నా మానస మధుపాత్రము
నీ మోవిపై ఒలికెను
నీ మధుర సుధాగాత్రము
నా మోవిపై పలికెను.

# ఆమనివై

(యుగళ గీతం)

ఆమనివై, జీవన బృందావనివై
చిర సురభిళ వాహినివై
రావే నా పెదవి మీద
రాగసుధా పాత్రవై—

బాలుడవై, బృందావన లోలుడవై
నవయుగ గోపాలుడవై
రారా నాలో మ్రోగే
రసమోహన మురళివై—

నీ మోవిని మురళి జేసి
నా వలపులు శ్రుతులు జేసి
నే మ్రోగించెద రావే
నీ ఆశలు తీరిపోవ—

నీ-కై దండలు నేను
విరిదండలుగా దాలిచి
మైమరచి నీలోపల
మధుమాసమునై తేలెద—

నీ నవ్వుల కవ్వములో
నవనీతమునై రానా
నీ మధురోహలలోన
నేను కరగిపోనా—

కరగే నాకన్నులలో
నీ రూపం చూచుకోర
తరగే నాకౌనులోన
నీ డెందము దాచుకోర—



ప్రేమా

# అందరు పాడే పాటకాదు

అందరు పాడే పాటకాదు
నీ డెందము నేసౌ
పాటరా ఇది
అందరు ఆడే ఆటకాదు
నా ఆనందము నీవౌ
ఆటరా ఇది___

నా మోవిని నీ మురళి చేసుకో
నా వలపులు నీ శ్రుతులు చేసుకో
తరళమైన నా నయన సరసిలో
తనివి తీర నీ రూపు చూసుకో___

నను దాచే ఈ కారుచీకటులు
ముడిచితిరా నా వాలుజడలుగా
నను వేచే ఈ తలిరుగాడుపుల
అల్లితి నా ఊపిరుల ఊయలగ___

మురిపించే ఈ లోక సుఖాలు
మరపించే ఆ నాక సుఖాలు
రాసిపోసి కట్టితి, రారా, నా
గుండెమీద నీకోసం గుడులుగ___

# ఆరబోసిన కురులు

ఆరబోసిన కురులు
అందాల మోముతో
ఆడినవి సయ్యాటలు
పాడినవి విరిపాటలు.

తోటలో నీ పైట
చిరుగాలితో ఆడె
ఆటలో రసగిరులు
ఆర్ద్రగీతులు పాడె.

ఎన్నెన్ని పూవులో
ఎన్నెన్ని తావులో
అన్ని నీ మేనిలో
ఐక్యమై పోయెనో.

నీ హొయలు - నీ రుచులు
నీ విభవాలు చూచి
తరులతా కుంజాలు
తల లూపెలే.

ఎన్నో వసంతాలు
ఎన్నో వాసంతికలు
నిను నన్ను జతకూర్చి
రాగమాలిక లల్లు.

# పెదవి విప్పి

పెదవి విప్పి చెప్పాలా
ప్రేమిస్తున్నానని
ఎడద విప్పి చెప్పాలా
పూజిస్తున్నానని—

నా కమ్మని కలలన్నీ
నీ కౌగిలి పంటలే
నా జీవన కళలన్నీ
నీ కన్నుల వెలుగులే—

నే కట్టే గుడులన్నీ
నీ గుండె మీదనే
నే పాడే పాటలన్నీ
నీ పెదవుల మీదనే—

నా తలపుల పూలన్నీ
నీ తలలో ముడిచాను
నా ఊహల రెక్కలన్నీ
నీ చూపుల పరచాను—

అన్ని తెలుసుకున్న నీవు
నన్ను తెలుసుకోలేవా
మిన్ను మన్ను కలిపే నను
నిన్ను చేరరానీవా!

# నీ మనసేమో నింగి

నీ మనసేమో నింగి
నా మనసేమో నేల
కనుమేరల కలసియుండు
కలకాలము వెలుగుచుండు.

నీవు హిమాచల శిఖరము
నేనొక చంచల పవనము.
నా ఇడుముల మబ్బులన్ని
నీ ఎదలో కరగిపోవు.

భాషాపద ఘట్టనాల
పడి నలిగే పాట నేను
భాషా శిఖరాల దాటి
పయనించే భావ మీవు.

ఆనందమునకై వెదకే
అజ్ఞాన ధునిని నేను
ఆనందమె ఎరుగని పర
మానందార్ణవము నీవు.

# సిమ్లాలో చూచాను

సిమ్లాలో చూచా నొక
చిన్నదానిని
కలల అలలురేపు మత్తు
కనుల దానిని........

మాలురోడుమీద అదో
మాదిరిగా నవ్వింది
చల చల్లని లోయల్లో
వేడిగాలి రువ్వింది........

ఉరుజఘనము బిగువుచనులు
సరితూగగ నడిచింది
వేల మన్మథులను కలచి
వేయు శరము విడిచింది....

మంచుపొరలవంటి పైట
మరచి జారవిడిచింది
జగతిగోళ అమరగోళ
యుగళము ప్రకటించింది....

మెయివంపులతో, వలపుల
మెరపువోలె మెరిసింది
నవభావ నందనాన్ని
నాలో నాటిపోయింది....

# హిమపాతం

హిమపాతం హిమపాతం
హేమంత సంగీతం
నల్లని మబ్బుల క్లబ్బులు
అల్లే తెల్లని గీతం....

చెట్లు చెలులు లతాంగనలు
స్ట్రిప్‌టీ జొనరించె
మేడలు వాడలు రోడ్డులు
గోడలు పళ్ళికిలించె—

పచ్చని పంటపొలాల
పారెను క్షీరములు
నీటికాలువలనిండా
నిండెను మీగడలు—

జంట జంటలుగా వీధుల
వెంటతిరుగు ప్రేమికుల
ఒడళ్ళనిండా కురిసెను
మల్లెల మొల్లల జల్లులు—

ఏమి హిమము! ఏమహిమమొ!
ఎల్లజగము తెల్లబోయె
వెలుపలి చలి లోపల చెలి
వెచ్చదనం నిండిపోయె—

# కలగాదది నిజము

కలగాదది నిజము
గాలిలోన గగనవీధి
కలిసికొంటిమే మనము....

నీ వలపుల చలి మబ్బులు
కురిసెను వెచ్చదనం
నీ వెచ్చని చిరునవ్వులు
విరిసెను చందనం....

నా కౌగిలిలో నీవు
నీ కన్నులలో నేను
ఎగసిపోవు విమానపు
ఎదలో మనమిద్దరమూ....

చిత్ర చిత్రమైన కళా
సీమలెన్నొ చూపావు
పలుకు పలుకులో ఒలికిన
భావ సుధలు త్రాపావు....

నీవు సాగిపోతివి - నను
నేలమీద దింపివేసి
వీడిపోయితివి ఏదో
వీడని బంధమువేసి....

నవ పరాగ విభవమిడి
నా రమవైనావు నీవు
నా ఎదలో నాట్యమాడు
నా ఉమవైనావు నీవు....

# నీ రూపము కనదలచి

నీ రూపము కనదలచి
నే కన్నులు మూసికొందు
నీ గానము వినదలచి
నే వీనులు మూసికొందు—

నీ కన్నులు కానలేక
నే చుక్కలు చూచుచుందు
నీ పెదవుల స్పర్శలేక
నే తలిరుల నిమురుచుందు—

ఏటికెరటములలో నీ
ఎలజవ్వనమును కందును
కమ్మతెమ్మెరలలో నీ
కలకంఠము వినుచుందును—

సిరిబొమ్మై నీవు ఆడ
చిట్టివాడనై పోదును
నీ తలపుల తావులలో
నింగి శిఖరమై పోదును—

రాకాశశిబింబ మీవు
రాకెట్టు చకోరి నేను
ఊహల రాడారు వేసి
ఉడుపథాల నేలుదాం—

# నీ వెంట నేనుంటే

నీ వెంట నేనుంటే సబలను
నీవు లేకుంటే నే అబలను—

పగలు రేయీ మనము
పార్వతీశివులమే
రేల రాధాకృష్ణ
లీలలే మనము—

అబలనా, కాదు, నీ
ఆనంద శిఖరమును
సబలనా, కాదు, నీ
స్వప్న సాగరమును—

నీవు దీపమైతే
నే స్నేహధారను
నీవు జలనిధివైతే
నే జలధరమును—

నేల నీవైతే, నే
నింగినై వ్రాలుదును
గాలి నీవైతే, నే
గంధమై తేలుదును—

# చిట్టి చిట్టి నవ్వులతో

చిట్టి చిట్టినవ్వులతో
చుట్టుకొంటివి
పట్టపగలె నా గుండె
పట్టుకొంటివి...

చీనీ చీనాంబరాలు
కట్టుకొంటివి
సంబరాల గొబ్బిళ్ళు
పెట్టుకొంటివి
రాక రాకతోనే
ఆకట్టుకొంటివి___

పేరులేని చెట్టుమీద
పిట్ట నంటివి
ఆరిపోని వెలుగు గుండె
గుట్టునంటివి
కేల కేలుపట్టి ఈల
పెట్టుమంటివి___

తలపు వలపు కొట్టు తలుపు
తట్టుమంటివి
కానరాని దేదో కాని
పెట్టు మంటివి
ఒట్టు లోకమంతా
కనుకట్టు అంటివి.

# చెలియ పంపె ఒక పత్రము

చెలియ పంపె ఒక పత్రము
దాని వెంట తన చిత్రము —

పత్రములో దాచింది
ప్రణయభావ శతపత్రము
చిత్రములో దాచింది
చిరునవ్వుల చైత్రము —

పత్రములో ప్రతిమాట
చిత్రమైన ఒకపాట
చిత్రములో ప్రతిరేఖ
చెప్పరాని ఒకలేఖ -

చిత్రంలో పత్రంలో
చిత్రించిన దొకటేను
ఒకటే రూపము - ఆత్మ
ఒకటేను - తాను - నేను -

పత్రము పఠించాను
పంచాక్షరినైనాను
చిత్రము దర్శించాను
చిన్మయుడైనాను —

# ఎందుకు నా మీద

ఎందుకు నా మీద
అంత
నింద మోపినావు
గాలి గుండెలోన, పెను
ధూళి రేపినావు ....

వెలుగు చూపినట్టి చేయి
విషనాగము అన్నావు
స్నేహానిలవీచికను
దావానల మన్నావు ....

మైత్రి సౌమిత్రిని నను
శత్రువుగా చిత్రించి
అపోహల అడవిలోన
ఆసురతకు ఎందులకో
అవకాశం ఇచ్చావు ....

నా ప్రమోదకర భాషకు
నీ ప్రమాదకర భావము
చేర్చి నన్ను రభసా
రామాయణమున దూర్చినావు ....

# నీ పాటల తోటలలో

నీ పాటల తోటలలో
నా భావ విహంగాలు
నీ ఆటల నిర్ఝరిలో
నా రాగ తరంగాలు....

నీ నవ్వుల వెన్నెలలో
నే రాకాచంద్రుడను
నీ ఆశల స్వర్గంలో
నేనే దేవేంద్రుడను -

నీ జీవన వసంతాన
నే దాగిన కోకిలను
నీ వలపుల డోలికలలో
నే వాడని వల్లికను -

నీ ఊహల లోకంలో
నే ఊగే భానువును
నీ తన్మయ తీరంలో
నే ఊదే వేణువును -

# చేద్దాము రావే భజన

చేద్దాము రావే భజన
చెలియా రేయంతా ....

గుండె మీద గుండె పెట్టి
గోవిందా గోవిందా అని
దండతోడ దండకలిపి
తందానా తందాన అని
చేద్దాము రావే భజన
చెలియా రేయంతా ....

పెదవులపై పెదవులు పేర్చి
పదములతో పదములు చేర్చి
కన్నులతో కన్నులు కలిపి
బుగ్గలపై బుగ్గలు నిలిపి
చేద్దాము రావే భజన
చెలియా రేయంతా ....

నడుముకు నడుముకు నడుమ
నాస్తికతను బంధించి
నాభి నాభిలో ఓంకార
నాదనారి సంధించి
చేద్దాము రావే భజన
చెలియా రేయంతా ....

నీ ఊపిరి నా ఊపిరిలో
నింగీ నేలా ముడివేసి
నా కురుల్లో నీ ముంగురుల్లొ
చీకట్లను పూడ్చేసి
చేద్దాము రావే భజన
చెలియా రేయంతా —

# నడిరాత్రి సుమగాత్రి

నడిరాత్రి సుమగాత్రి
నడచివచ్చె నాగదికి

నాగదికి నా హృదికి
నాభావ సుమవనికి
నడచివచ్చె సుమగాత్రి
నాగదికి నడిరాత్రి—

సుమవనికి రసధునికి
నా కోర్కెల ఆమనికి
ఆమనికి ఆ దివికి
నా ఆనందాంబుధికి
నడచివచ్చె నడిరాత్రి
నాగదికి సుమగాత్రి—

సుమగాత్రి మధుపాత్రి
నా జీవన సావిత్రి
నడచివచ్చె నడిరాత్రి
నడిరాత్రి సుమగాత్రి
నడచివచ్చె నా గదికి
నా భావసుమవనికి—

# కామినీ విలాస నటన

కామినీ విలాస నటన
కథనమ్మే భువిచరిత్ర
భామినీ వినూత్న నాట్య
రంగమ్మే ఈ ధరిత్రి....

ఇతిహాస పురాణాలు
సతినిమిత్త కలహాలు
ప్రతికథకు కావ్యానికి
ఇతివృత్తం "సతిశీలం"....

సామ్రాజ్యా లేలినట్టి
సామ్రాట్టులు, రణవీరులు
రమణీ దృగ్వల్లుల ఘో
రముగా బందీ లయారు....

నారాయణ మంత్రముగ్ధ
పారాయణులౌ యోగులు
నారీ మధురాధరామృ
తారాధకులౌ భోగులు....

నీ లేమిచే జగద్యంత్ర
మాగిపోవు ధూళి రేగు
చిక్కెద నీ కౌగిలిలో
ఎక్కడకూ పోను నేను
దాసోహం దాసోహం
ఓ సఖీ! కళాముఖి
ప్రణయ వాహినీ! రాణీ!

# ఎన్నెన్నో నదులు దాటి

ఎన్నెన్నో నదులు దాటి
యమునాతీరం చేరితి
వేలవేల రుతులు రోసి
వేణుగానం కోరితి —

యమున అలలు నా వలపులు
వెన్నెల ఊయల లూగును
వేణువులో నా తలపులు
గానలహరులై సాగును —

చీకటి, యమునాతటిపై
శ్రీకృష్ణాకృతి దాల్చెను
అందము - ఆనందముతో
బృందావనినై కొల్చెను —

గోపాలునికై వెదకుచు
గోపికనై పోతిని
వేణుపాణి కానలేక
వేణుగానమై పోతిని —

# కళావిలాసిని మేలుకొన్నది

కళావిలాసిని మేలుకొన్నది
కలలో నా కలలో
కలలన్నీ వాస్తవమైనవి
నా కలలో ఆ కలలో —

ఆమె కళ్ళలో అందాలన్నీ
ఆమనియై విరిసినవి
ఆమె మోవిపై మురిపాలన్నీ
అమృతమై కురిసినవి —

అహోరాత్రములు ఆమె గుండెపై
గుడులై వెలసినవి
నింగి నేలలు ఆమె నడుముపై
జడలై వ్రాలినవి —

కోటి రాగములు కోటి భావములు
కోమలియై పోయినవి
అన్ని శక్తులు అన్ని యుక్తులు
ఆమెయె అయిపోయినవి —

చేతులెత్తి పూజింపబోవగా
చెదరిపోయినది ఆమె
ప్రణయ భావ ప్రపత్తి చూపగా
ప్రసన్నమైనది ఆమె—

## ఇందువదన

ఇందువదన కుందరదన
సుందరతారానయనా !

చీకట్లో పుట్టాను
చీకట్లో పెరిగాను
చీకటిలోనే కందును
నే కలలెన్నో___

ఏ చీకటినీ కనని
రోచిర్మతి వీవు
ఏ తీరున వివరింతును
నా చీకటి గోడు___

తిమిరాలే తెరువై
తిమిరాలే తేరై
తిరుగాడే నా కళ్ళకు
తొలి వెలుగే నీవై తివి___

వెలుగురూపు నాకు చూపి
వెలిగే దేవివి నీవు
నీ - నా చూపులు కలిసిన
నిలువదు ఏ చీకటైన.

# పైటజారుతూంది

(యుగళ గీతం)

పైటజారుతూంది, చేయి
పట్టకముందే, నీవు
ముట్టకముందే, తాళి
కట్టకముందే -

పైటజారితే జారే
ఫరవాలేదు, కాని
కాలు జారనీయద్దే ముద్దులగుమ్మా !
నా ముద్దులబొమ్మా !

చెమట కారుతూంది, గదికి
చేరకముందే, తలుపు
వేయకముందే, నీతో
వేగకముందే -

చెమటకారితే కారే
చెరుపేముందే, కాని
నీరుకారిపోవద్దే నిండినకుండా !
నా వలపులదండా !

మతిపోతున్నది, సరస
మాడకముందే, నీ జత
కూడకముందే, గుండెలు పాడకముందే -

నీ మతిపోతే పోనీ
నా మతి పోనీయద్దే
నా మతిపోకముందే
శ్రీమతివై రావే !

# నీ గదినుండి నా గదిలోకి

నీ గదినుండి నా గదిలోకి
నీవువచ్చినవేళ - నిదుర పోయినది కాలం
నా గదినుండి నీ గదిలోకి
నీవుపోయినవేళ - నిట్టూర్చినది కాలం —

సిగ్గు సిగ్గుగా
చీకటి నవ్వుచు
చెవులో ఊదిన మాటలే
మన బ్రతుకులు నడిపే బాటలు —

పెదవి పెదవిని
ఎద ఎద మీటి
ప్రేమకు నేర్పిన పాటలే
విరిసిన ఆమని తోటలు —

ఊహల రెక్కల
ఊయల లూగిన
నీ కన్నులు నా కనులలో
నిలిచెను వెన్నెలవాకలై —

గదిలో ఆరిన
గాజు దీపములు
నీ - నా మదిలో వెలిగెను
చిరత్న రాగ దీపములై

# నా రమ నీవే

నా రమ నీవే
నా ఉమ నీవే
నను నడిపించే
వాణివి నీవే__

నా వల పీవే
నా తల పీవే
నను పలికించే
నాదము నీవే__

నా స్థితి వీవే
నా గతి వీవే
నను మురిపించే
నవ రతి నీవే__

నా గత మీవే
ఆగత మీవే
నను వెలిగించే
ప్రస్తుత మీవే__

నా ఇహ మీవే
నా పర మీవే
నాలో నిండిన
జీవము నీవే__

# కలలన్నీ నీకన్నులల

కలలన్నీ నీకన్నులల
కాటుకలయ్యే
నాదా లెన్నో నాలో
వేదాలయ్యే —

నే పాడిన పాటలన్నీ
నీ కన్నీరయ్యే
నీ కజ్జల రేఖలేమొ
నా కావ్యా లయ్యే —

మాట్లాడిన నీ మనసు
మౌనిని చేసె నన్ను
మూగవడిన నీ మోమే
ప్రేమోగించెను నన్ను —

అడగనపుడు ఇచ్చినట్టి
ఆత్మీయత నీది
అడుగుటయే ఫలమనుకొను
ఆదర్శం నాది —

నా గది తలుపులు నీకై
నే తెరచితిని
నా మదియే నీ గదియని
నే మరచితిని —

# కొమ్మలలో కోకిలమ్మ

కొమ్మలలో కోకిలమ్మ
కుహూ కుహూమన్నదే
నిన్ను నన్ను జంటకూడి
నేడే రమ్మన్నదే....

కొండమీద సెలయేటి
గుండెఝల్లుమన్నదే
మనము ఆడి పాడకున్న
మనలే నంటున్నదే....

పచ్చని తోటల మోములు
వాడిపోవుచున్నవే
మన ప్రణయ వసంతముకై
వలచి వేచియున్నవే....

తెల్లని వెన్నెల, మొయిలు
తెరల దూరుచున్నదే
మన వియోగ విలయాగ్నికి
మండుచుంటి నన్నదే....

కడలి కెరటములు మనకై
కదలివచ్చుచున్నవే
తీరములో మనములేక
తిరిగిపోతున్నవే....

చీకటి లోకాన్ని చూచి
చంచల కంపించెనే
కంపములో మనగుండెలు
కలిపి కౌగిలించెనే....

# చూచి చూడగానే

చూచి చూడగానే
ఎదదోచుకొంటివి
పలుకు పలుకగానే
వశపరచుకొంటివి—

నీ చూపులకెంత వింత
నేర్పుఉన్నదో!
నీ పలుకుల కెంత మంత్ర
శక్తిఉన్నదో—

మహీ ప్రదర్శనశాలను
మట్టిబొమ్మ నేను
నీ స్పర్శానుభూతిలో
నింగినంటినాను—

ప్రేమభావ ప్రేమరూప
ప్రేమాత్ముడ వీవు
దేవుని నమ్మని నాకు
దేవుడవైనావు—

నా తరుణారుణ జీవిత
నవ సంధ్యాగేహాళిలో
ప్రణయ విప్లవానంద
ప్రభాకరుడ వీవు—

# వద్దు వద్దంటుంటె

వద్దు వద్దంటుంటె
ముద్దుపెట్టాను
అనుభూతి గగనాల
హద్దు ముట్టాను—

ప్రేమతో ఈవ్యోమ
గామి తను చేరుటకు
అందాల జాబిల్లి
అనుమతేలాయని—

కాముకత, రసమోక్ష
గాముకత ముక్కలిడ
పావన హసద్గంగ
పంకిలము కాదని—

నా రూపు చూచు
కున్నందుకే నీచెక్కు
టద్దాలు మాసి
పోవునా యని ఎంచి—

నీ మంచుమల ఎదకు
ఏమచ్చ కలిగినా
కన్నీటి గంగతో
కడిగి వేస్తానులే—

# వడగాలివై వచ్చి

వడగాలివై వచ్చి
వాసంతమైతివి
మోడుబ్రతుకును పూల
మేడగా మలచితివి
నీ చేతి చలువందునా
నా చేతనమ్మందునా !

మౌనముగ వచ్చితివి
మనసు పలికించితివి
గున్నమావికి వలపు
గొంతుకై పోయితివి
నీ రాగ మహిమందునా
నా యోగ బలమందునా !

పాడినదె పాడితివి
పరవశుని చేసితివి
మండుటెండకు మధుర
మాకందమైతివి
నీ - రసావేశమననా
నా - రసపిపాస యననా !

వెర్రిగా నాకొరకె
వెదకినటులే వచ్చి
నన్నె వెర్రిని చేసి
నవ్వుకొనుచున్నావు
ప్రజ్ఞ నీదే యందునా
ఉపజ్ఞ నాదే యందునా !

# కేలిబొమ్మను

కేలిబొమ్మను చేసినావు
నా మీద
జాలైన పడవేమి నీవు !

చదువులెన్నో చదివినాను
సకల
శాస్త్రాల సారమెరిగాను
కాని నీ రూపము
కని బేలనై పోదు....

తెలివితేటలు మెండు నాకు
తెలుసు
తెల్లముగ మంచి చెడు నాకు
ఎందుకో నీ మోము ముందు
మందుడ నౌదు....

ఖండఖండాలు చూశాను
దండి
దండికవితలు వ్రాసినాను
కాని నీచెక్కిళ్ళకడ
విస్తుపోయేను....

సిరులు సంపదలెన్నొ కలవు
నాకు
తరగనియశోరాశి కలదు
ఐన నీ పదధూళికై
చేయి సాచేను....

# తుమ్మెదపాట

తుమ్మెదపాట పూలకు
అర్థమౌనులే
పూలభాష తుమ్మెదకూ
అర్థమౌనులే___

ఏ కానల ఏ కోనల
ఏ కుసుమం పిలిచిందో
ఆలించే భృంగాలు
లీలాసారంగాలు___

ఏ రుతిలో ఏ స్థితిలో
ఏ మధుపము వలచిందో
గుర్తించే పుష్పాలు
గోపీజన హృదయాలు___

ఏ వేళల ఏ తావుల
ఎవరిని అలరించాలో
ఎరిగినబృందావిహారి
ఇంద్రనీలమధుపాయి___

వింత వింత రంగులన్ని
విరిబాలలకేనా
అందరి ఆనందాళి
అమృతరూప మొకటేనా ?

# నాకున్నవి రెండే రెండు

(యుగళగీతం)

నా కున్నవి రెండే రెండు తెన్నులు
నను పిలిచే నను వలచే నీ కన్నులు—

నా కున్నవి రెండే రెండు వరాలు
నన్ను నిన్ను ఒకటిచేయు నీ కరాలు

నా కున్నవి రెండే రెండు పదవులు
మురిపించే మరిపించే నీ పెదవులు—

నా కున్నవి రెండే రెండు పువ్వులు
కనిపించే వినిపించే నీ నవ్వులు—

నా కున్నవి రెండే రెండు మేడలు
ఇరుసంజల నాలోగల నీ నీడలు—

నా కున్నవి రెండే రెండు ఋక్కులు
ఆడించే పాడించే నీ వాక్కులు—

మనకున్నవి రెండే రెండు ఫలాలు
మన ప్రేమకు మననోముకు ప్రతిఫలాలు—

# గదిలోని గాజుదీపము

గదిలోని గాజుదీపము మలిగిపోయె
మదిలోన రాగదీపము వెలిగిపోయె

అంధకారము
మత్తుగంధాలు చల్లినది
పట్టి నిను నను
పూలపాటగా అల్లినది—

కనిపించు తనువులు
కనుమరుగై పోయె
కనరాని తలపులే
కన్నులై పోయె—

కాంతిలో ఎన్నెన్ని
భ్రాంతులు భయాలు ?
ధ్వాంతాన కొండంత
ధైర్యశౌర్యాలు—

వెలుగులో వాస్తవము
కలవోలె తోచె
చీకటుల మనకలలు
చిత్రముగ పూచె—

# ఎన్నెన్ని అందాలు

ఎన్నెన్ని అందాలు ఈ భూమిమీద
ఎన్ని ఆనందాలు ఈ బ్రతుకులోన

కడలి కెరటాలపై
కదలు నౌక అందం
కొండ కొమ్మన
కూరుచుండు నొక అందం—

తేనె టూహలలోన
తేలుటానందం
అంబరాన విమాన
యాన మానందం—

పల్లె ఒడిలోన
వర్థిల్లు ఒక అందం
పట్టణాలకు
ఆటపట్టు వొక అందం—

పూలు నగుపూలు పొంగించు ఆనందం
ఉభయ సంధ్యారాగ విభవ మానందం
అన్ని అందా లొక్కటయ్యె నీయందే
అన్ని ఆనందాలు ఆడు నీ ముందే —

అంద మానందం
ఆనంద మందం
అందుకే నాగమ్యమాయె
నీ డెందం—

# పైట జారిపోతూంది

(యుగళ గీతం)

పైట జారిపోతూంది
చెమట కారిపోతూంది
మామా నిను చూస్తుంటె
మనసు కరగి పోతూందీ —

పైట జారితే జారే
చెమట కారితే కారే
మనసు కరగితే మాత్రం
మళ్ళీ ముద్దకట్టదే !

ఒంటిమీద పైటపోయి
ఒంటిలోని చెమటపోయి
ఉక్కిరి బిక్కిరైనాక
ఉంటుందా మనసు!

పైటజారి చెమటకారి
వయసు పరుగు తీస్తుంటే
మనసా మనసా అని నా
మనసు పాడుచేయద్దె !

పైటంటే పైటకాదు
పట్టువీడిపోతూందీ
చెమటంటే చెమటకాదు
శక్తి కరగిపోతూంది
మనసంటే మనసుకాదు
మాయ కమ్ముకుంటూంది—



రామం

# తప్పు చేశానంటె

తప్పు చేశానంటె
ఒప్పుకుంటాను
ముప్పు చేశానంటె
తప్పుకుంటాను.

నీ వెండి నవ్వులను
నే వెన్నెలనుకొని
మసక చీకటిలోన
మైమరచినాను.

నిన్నడగకుండానే
నీ సొగసుతోటలో
పూవొకటి కోశాను
పోకిరినిగాను.

ప్రేమించుటకు, అడ్డు
లేమిటని అనుకొంటి
పూజించుటకు, ఆజ్ఞ
పొందుటే మనుకొంటి.

దండించ దలచితే
ఖండించు నా శిరము
పాపమెరుగని గుండెపై
కత్తి దూయకుము.

# కొంగు జారవిడిచిందో

కొంగు జారవిడిచిందో
కొంప లంటుకుంటాయి
పండు మోవి విరిచిందో
గుండె లంటుకుంటాయి -

కరగిపోవు నడుంచుట్టు
పెరిగిపోవునట్టి సిరులు
తత్తరపడు ఉరంమీద
నృత్తమాడు పసిడిగిరులు
చూచి బండరాళ్ళుకూడ
భావగీతులై పోవును -

ఓరచూపు కటారుల
వీరవిలాసంలోన
జటాధరులు నటరాజులు
పటపట తెగిపడిపోదురు -

ఒయారంగ ఒళ్ళంతా
ఒక్కసారి కుదిపిందో
త్రికాలాలు త్రిజగాలు
తికమక పడిపోతాయి -

రమ్మని రా రమ్మని
ఏ రసికునైన పిలిచిందో
వాని విలాసము తృటిలో
వైకుంఠానికి మారును.

# నెదరులాండులో

నెదరులాండులో నేడు
నిదుర లేచినవి పూలు
నిదురలేచి నిదురలేపె
ఎద ఎదలో పరిమళాలు —

తొలివలపుల ట్యులిప్ పూలు
పలువన్నెల గులాబీలు
రూపవతులు డ్యాపడీలు
దీపించె వసంతవేళ —

పూబోడుల మధురోహల
పులకరించె మట్టినేల
కైపెక్కి పురాలు తేలె
కార్నివాలు సంబరాల —

కోమల 'సుమబాల' లంత
'కుకెన్‌హాపు' లో కూడిరి
పూవిల్తుల మతివో
నానావిధ నాట్యాలాడిరి —

తీగెల నగవులు పూవులు
పూవుల వలపులు తావులు
పూవులు తావులు నీవౌ
జీవితవని నాది సఖీ !
చిరవసంతహాసముఖీ !

# నీవు కోరికిన ఉసిరికాయలు

నీవు కోరికిన ఉసిరికాయలు
కూడ తీయని ద్రాక్షలౌ
చిలుక కోరికిన పసరుకాయలు
కూడ తేనెల సోనలౌ -

చిలుకవని నిన్నందునా
నీ పలుకు బంగారం
పలుకవే నా పలుకుకందని
కలికి సింగారం !

నీవు తాకిన నాతనూశిల
చేతనా జలపాతమౌ
మధువసంతం తాకినప్పుడు
మోడులే పూమేడలౌ -

నవవసంతము నీవెయన
నీ సిగ్గు మొగ్గలు వేయును
నవ్వవే! నీలోనె
బృందానందనాలు పూయును -

మంచుమల ఎద కరగకే
చలించునా గంగాఝురి?
కదలి తప్తముకానిదే
చమరించదేమొ పయోధరి !

రాగనగమై త్యాగశరధై
కరగితి మరగితి నీకై
ప్రేమధునివై దయాంబుదమై
ఆడవే పాడవే నాకై -

# నిన్ను తలచుకొన్నప్పుడు

నిన్ను తలంచుకొన్నప్పుడు
ఎన్నిపాటలో
నిన్ను పిలుచుకొన్నప్పుడు
ఎన్ని భాషలో -

చెలియా అని అనగానే
చిరుగాలులు పాడును
సఖియా అని పిలిచినంత
సాగరాలు ఆడును -

నిను పిలిచే పొడిమాటలె
నీరదాలుగా మారును
నిను కొలిచే చిరుచేతులె
నింగి కొసలదాక సాగు -

నీ వగుపించనిచో నా
కన్నీరే కావ్యము
నీ వగుపించినచో మరి
నీవే నా కావ్యము -

# ఎంతముద్దు నీ పేరు

ఎంత ముద్దు నీ పేరు
ఎంత ముద్దు నీ తీరు
ఎంతిముద్దో నీ పొందు
ఎవరు నమ్మలేరు -

చెప్పరాని కలలకన్న
గొప్పకావ్యాలకన్న
ముచ్చటలే నీతో, నా
ముద్దుల కాపురము -

నీ భుజబలముండగ నా
కే భయంలేదు
నీ బుద్ధిబలం తీర్చని
ఏ శంకలు లేవు -

దివియని భువియని లేదు
దివారాత్రములు లేవు
నీ ప్రేమారామానికి
ఏ అవధులు లేవు -

మానిని అనుభూతికి నీ
మనసే తుదిహద్దు
ఈ జన్మం చాలు ఇం
కేమీ నాకు వద్దు -

# ఏ జన్మలోనైన

ఏ జన్మలోనైన
నా జీవితేశ్వరివి
రాజీవనేత్రి నీవే !

నా జాడ తెలిసికొని
ఈ జన్మ మెత్తావు
నా తెరువు నా తేరు
నీవెయై వచ్చావు -

ప్రేయసీప్రియులవలె
ప్రేమించుదామంటె
పేరు పెట్టగరాని
ప్రేమ మనదంటావు -

చదువేల నీ మనసు
చదువు చాలంటివి
ధనమేల మన త్యాగ
ధనము మేలంటివి -

ఈ లోకయాత్ర మనకు
ఎంత కాలం అంటె
కలసిపోయెడి అంత
కాలమని అంటావు
వ్యంగ్య మెందులకంటె
వ్యాఖ్య వలదంటావు -

# బాపురెడ్డిగారి మరికొన్ని రచనలు

## SOME OTHER WORKS OF BAPU REDDY

| | |
|---|---|
| బాపురెడ్డి గేయ నాటికలు | BAPU REDDY GEYA NATIKALU |
| బాపురెడ్డి గద్యకావ్యాలు | BAPU REDDY GADYA KAVYALU |
| బాపురెడ్డి పద్యకావ్యాలు | BAPU REDDY PADYA KAVYALU |
| అనంత సత్యాలు | ANANTHA SATYALU (Free verse) |
| వ్యవధిలేదు (అనువాదం) | VYAVADHILEDU<br>(A Translation of Dr. KNARIG BOYADJIAN'S English poems 'There is no Time') |
| ఇన్ క్వెస్ట్ ఆఫ్ హార్మొనీ | *In quest of Harmony*<br>(Collection of poems in English) |
| శ్రీకార శిఖరం | SRIKAARA SIKHARAM<br>(Collection of lyrics) |
| నా దేశం నవ్వుతూంది | NAADESAM NAVVUTUUNDI<br>(Collection of lyrics) |

* * * *